# కృష్ణశతకము

ప్రతిపదార్థ సహితము



ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని, (లిమిటెడ్)

ప్రాప్తిస్థానము:— తెనాలి.



 [వెల 0—1—0.

శ్రీరస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.





# కృష్ణశతకము.



క. శ్రీరుక్మిణీశ కేశవ
నారద సంగీతలోల నగధర శౌరీ
ద్వారకనిలయ జనార్దన
కారుణ్యముతోడ నన్ను గావుము కృష్ణా. 1

క. నీవే తల్లివి దండ్రివి
నీవే నా తోడునీడ నీవే సఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృ. 2

క. నారాయణ పరమేశ్వర
ధారాధర నీలదేహ దానవవైరీ
క్షీరాబ్ధిశయన యదుకుల
వీరా నను గావు కరుణ వెలయగ కృ. 3

క. హరి యను రెండక్షరములు
హరియించును పాతకము లంబుజనాభా
హరి నీనామ మహాత్మ్యము
హరిహరి బొగడంగ వశమె హరి శ్రీ కృ.

క. క్రూరాత్ముఁ డజామిళుఁడు
నారాయణ యనుచు నాత్మనందను బిలువ
న్నేరీతి నేలుకొంటివి
యేరీ నీసాటివేల్పు లెందున కృ.

క. చిలుకల కొలికియు ముద్దుల
చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతి పేరం
బిలిచిన మోక్షము నిచ్చితి
వలరగ మిము దలచు జనుల కరుదా కృ.

క. అక్రూర వరద మాధవ
చక్రాయుధ ఖడ్గపాణి శౌరి ముకుందా
శక్రాది దివిజ సన్నుత
శుక్రార్చిత నన్ను కరుణఁ జూనము జూడుము కృ.

క. నందుని ముద్దుల పట్టిని
మందరగిరి ధరుని మాధవు విష్ణున్
సుందర రూపుని మునిగణ
వందితు మిము దలతు భక్తవత్సల కృ.

క. ఓ కారుణ్యపయోనిధి
నాకాధారంబవగుచు నయముగఁ బ్రోవ
న్నాకేల యితరచింతలు
నాకాధిపవినుత లోకనాయక కృ.

వేదంబులు గననేరని
యాది పరబ్రహ్మమూర్తి యనఘ మురారీ
నాదిక్కు జూచి గావుము
నీదిక్కే నమ్మినాడ నిజముగ కృ. 10

పదునాలుగు భువనంబులు
కుదురుగ నీ కుక్షి నిల్పుకొన్న నేర్పరివై
విదితంబుగ యాదేవకి
యుదరములో నెట్లొదిగియుంటివి కృ. 11

అష్టమి రోహిణి ప్రొద్దున
యష్టమ గర్భమున బుట్టి యాదేవకికిన్
దుష్టుని కంసు వధింపవె
సృష్టి ప్రతిపాలనంబు సేయగ కృ. 12

అల్లజగన్నాథునకు రే
పల్లియ క్రీడాస్థలమయ్యె పరమాత్మునకున్
గొల్లసతి యా యశోదయు
తల్లియునై చన్నుగుడిపె దనరంగ కృ. 13

అందెలు గజ్జెలు మ్రోయగ
చిందులు ద్రొక్కుచును వేడ్క చెలువారంగా
నందుని సతి యాగోపిక
ముందర నాడుదువు మిగుల ముద్దుగను కృ. 14

హరిచందనంబు మేనున
కరమొప్పెడు హస్తములను కంకణ రవమున్
యురమున రత్నము మెరయగ
బరగినదా నీదు బాల్య వయసది కృ. 15

క. పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయఁగ పింఛం
బాణీముత్యము ముక్కున
నాణెముగా దాల్చు లోకనాథుఁడ కృ.

క. మడుగుకు జని కాళింగుని
పడగలపై భరతశాస్త్ర పద్ధతి నిలయం
గడు వేడుకతో నాడెడు
నడుగులు నే మదితలంతు నచ్యుత కృ.

క. బృందావనమున బ్రహ్మా
నందార్భక మూర్తి వేణునాదము నీవుఁ
మందార మూలమున గో
విందా పూరింతువౌర వేడుక కృ.

క. వారిజ నేత్రులు యమునా
వారిని జలకంబు లాడ వచ్చిన నీవున్
చీరలు ముచ్చిలి యిచ్చితి
నేరుపురా యిదియు నీకు నిజముగ కృ.

క. దేవేంద్రుఁ డలుకతోడను
వావిరిగా రాళ్ళవాన వడిగురియింపం
గోవర్ధన గిరి యెత్తితి
గోవుల గోపకుల గాచుకొఱకై కృ.

క. అండజవాహన విను బ్ర
హ్మాండంబుల బంతులాడ యాడెడు నీవుం
కొండల నెత్తితి వందురు
కొండిక పనిగాక దొడ్డకొండా కృ.

క. హంసాలంబిత కుండల
కంసాంతక నీవు ద్వారకాపురిలోనన్
సంసారి రీతినుండి ప్ర
శంశార్హుఁడ వైతివహహా జగతిని కృ. 22

క. పదియాఱు వేల నూర్వురు
సుదతులు నెనమండ్రు నీకు సొంపుగ భార్య
ల్విదితంబుగ బహురూపుల
వదలక భోగించు నైత్యవైరివి కృ. 23

క. అంగన పనుపున ధోవతి
కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిన యా
సంగతి విని దయనొసగితి
రంగుగ సంపదలు లోకరక్షక కృ. 24

క. హా వసుదేవ కుమారక
కావుము నామానమనుచు కామిని వేడ
న్నావనజాక్షికి నిచ్చితి
శ్రీవర యక్షయ మటంచు చీరలు కృ. 25

క. శుభ్రమగు పాంచజన్యము
అభ్రంకష పగిది మ్రోవ నాహవభూమిన్
విభ్రమలగు దనుజ సుతా
గర్భంబులు బగులజేయు ఘనుఁడవు కృ. 26

క. జయమును విజయున కియ్యవె
హయముల ములుకోలమోపి యదలించి మహా
రయమున రొప్పవె తేరును
భయమున రిపుసేన విరిగి పారగ కృ. 27

క. దుర్జనులగు నృపసంఘము
నిర్జింపగ దలచి నీవు నిఖిలాధారా
దుర్జనులను వధియింపను
నర్జును రథ చోదకుండ వైతివి కృ. 28

క. శక్రసుతు గాచుకొఱకై
చక్రము చేపట్టి భీష్ము జంపగ జనునీ
విక్రమ మేమని పొగడుదు
నక్రగ్రహ సర్వలోక నాయక కృ. 29

క. దివిజేంద్ర సుతుని జంపియు
రవిసుతు రక్షించినావు రఘురాముఁడవై
దివిజేంద్ర సుతుని గాచియు
రవిసుతు బరిమార్చితౌర రణమున కృ. 30

క. దుర్భర బాణమురాగా
గర్భములోనుండి యభయ కావుమటన్నన్
నిర్భర కృప రక్షించితి
నర్భకు నభిమన్యు సుతుని నత్యుత కృ. 3

క. గిరులందు మేరువౌదువు
సురలందును నింద్రుఁడౌదు చుక్కలలోన
న్బరమాత్మ చంద్రుఁడౌదువు
నరులందున నృపతివౌదు నయముగ కృ. 3

క. చుక్కల నెన్నగ వచ్చును
గ్రక్కున భూరేణువులను గణుతింపనగున్
జొక్కపు నీగుణజాలము
నక్కజమగు లెక్కపెట్ట నజునకు కృ. 3

క. కుక్షిని నఖిల జగంబులు
విక్షేపము జేసి ప్రళయ నీరధి నడుమ
న్వృక్షక వటపత్రముపై
దక్షత పవళించునట్టి ధన్యుడ కృ. 34

క. విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింపదలచి విష్ణుఁడవనగా
విశ్వము జెరుపను హరుఁడవు
విశ్వాత్మక నీవు యగుచు వెలయగ కృ. 35

క. అగణిత వైభవ కేశవ
నగధర వనమాలి యాది నారాయణ యో
భగవంతుఁడ శ్రీమంతుఁడ
జగదీశ్వర శరణు శరణు శరణము కృ. 36

క. మగమీనమవై జలనిధి
పగతుని సోమకుని జంపి పద్మభవునకు
న్నిగమములు దెచ్చి యిచ్చితి
సుగుణాకర మమ్ము గరుణఁ జూడుము కృ. 37

క. అందరు సురలును దనుజుల
పొందుగ క్షీరాబ్ధి దరువ పొలపున నీవున్
అందముగ కూర్మ రూపున
మందరగిరి యెత్తితౌర మాధవ కృ. 38

క. ఆది వరాహమవయ్యును
నా దనుజ హిరణ్యనేత్రు హతుజేసి తగన్
మోదమున సురలు వొగడగ
మేదినిగడిగొడుగు యెత్తి మెరసితి కృ. 39

క. కెరలి యర చేత కంబము
నరుదుగ వేయుటను వెడలి యసురేశ్వరునిన్
యురమున జీరి వధించితి
నరహరి రూపావతార నగధర కృ. 40

క. వడుగవునై మూడడుగులు
గడిగితివా భళిర భళిర యఖిల జగంబుల్
దొడిగితివి నీదు మేనున
గడు చిత్రము నీచరిత్ర ఘనుడవు కృ. 41

క. ఇరువదొకమార్లు నృపతుల
శిరములు ఖండించితౌర చేగొడ్డంటన్
ధర కశ్యపునకు నిచ్చియు
బరగవె జమదగ్ని రామభద్రుడ కృ. 42

క. దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీత దెచ్చికొనియు నయోధ్య
న్విశదముగ కీర్తినేలిన
దశరథ రామావతార ధన్యుడ కృ. 43

క. ఘనులగు ధేనుక ముష్టిక
దనుజుల చెండాడితౌర తగభుజశక్తిన్
అనఘాత్మ రేవతీపతి
యనగా బలరామమూర్తి వాగద కృ. 44

క. త్రిపురాసుర భార్యల నతి
నిపుణతతో వ్రతముచేత నిలిపినకీర్తుల్
కపటపు రాజవు భళిరే
కృపగల బౌద్ధావతార ఘనుడవు కృ. 45

క. వలపుల తేజీ నెక్కియు
యిలపై ధర్మంబు నిలుప హీనుల ద్రుంపన్
గలియుగము తుదిని వేడుక
కలికివిగా నున్న లోకకర్తవు కృ. 46

క. వనజాక్ష భక్తవత్సల
మునులగు మూర్తిత్రయంబు కరుణానిధివై
విను నీ సద్గుణజాలము
సనకాది మునీంద్రు లెన్నజాలరు కృ. 47

క. అపరాధ సహస్రంబుల
నపరిమితములైన యఘము లనిశము నేనుం
గపటాత్ముడనై జేసితి
చపలుని ననుగావు శేషశాయివి కృ. 48

క. నరపశువు మూఢచిత్తుడ
దురితారంభుడను మిగుల దోషకుండను నీ
గురుతెరుగ నెంతవాడను
హరి నీవే ప్రాపు దాపు నౌదువు కృ. 49

క. పరనారీ ముఖపద్మము
గురుతుగ కుచకుంభములను గొప్పను నడుము
న్నరయంగనె మోహింతురు
నిరతము నిను భక్తిగొల్వ నేరరు కృ. 50

క. పంచేంద్రియ మార్గంబుల
కొంచపు బుద్ధిని చరించి గొన్నిదినంబుల్
ఇంచుక సజ్జన సంగతి
యంచును మిమ్మెఱిగినాడ నిప్పుడె కృ. 51

క. దుష్టుండ దురాచారుడ
దుష్టచరిత్రుఁడను చాల దుర్బుద్ధిని నే
భ్రష్టు నిను గొల్వనేరను
కష్టుని ననుగావు కావు కరుణను కృ. 52

క. కుంభీంద్ర వరద కేశవ
జంభాసుర వైరి దివిజ సన్నుత చరితా
యంభోజనేత్ర జలనిధి
గంభీరత నన్నుగావు కరుణను కృ. 53

క. దిక్కెవ్వరు ప్రహ్లాదుని
దిక్కెవ్వరు పాండుసుతుల దీనుల కెపుడు
న్దిక్కెవ్వ రయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవె నాకు దిక్కవు కృ. 54

క. హరినీవె దిక్కునాకును
సిరితో నేతెంచి మకరి శిక్షించి దయం
బరమేష్ఠి సురలు బొగడఁగ
కరిగాచిన రీతి నన్ను గావుము కృ. 55

క. పురుషోత్తమ లక్ష్మీపతి
సరసిజ గర్భాదిమౌని సన్నుత చరితా
మురభంజన సురరంజని
వరదుఁడవగు నాకు భక్తవత్సల కృ. 56

క. క్రతువుల తీర్థాగమముల
వ్రతములు దానములు సేయవలె నాలక్ష్మీ
పతి మిము దలచిన వారికి
నతులిత పుణ్యములు గలుగు టరుదా కృ. 57

క. స్తంభమున వెడలి దానవ
డింభకు రక్షించినట్టిరీతిని వెలయన్
అంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుగావు కరుణను కృ. 58

క. శతకోటి భాను తేజుఁడ
యతులిత సద్గుణగణాఢ్య అంబుజనాభా
రతినాధ జనకలక్ష్మీ
పతి హితననుగావు భక్తవత్సల కృ. 59

క. మందుడ నే దురితాత్ముఁడ
నిందల కొడిగట్టినట్టి నీచుని నన్నున్
సందేహింపక కావుము
నందుని వరపుత్ర నిన్ను నమ్మితి కృ. 60

క. గజరాజ వరద కేశవ
త్రిజగత్కల్యాణమూర్తి దేవ మురారీ
భుజగేంద్రశయన మాధవ
విజయాప్తుఁడ నన్నుగావు వేడుక కృ. 61

క. గోపాల దొంగ మురహర
పాపాలను పారదోలు ప్రభుడవు నీవే
గోపాలమూర్తి దయతో
నాపాలిట గలిగిప్రోవు నమ్మితి కృ. 62

క. దుర్మతి నేబలుకష్టపు
కర్మంబులు జేరినట్టి కష్టుఁడ నన్నున్
నిర్మలుని జేయవలెనని
నిష్కర్ముఁడ నినునమ్మినాడ సతతము కృ. 63

క దుర్వార చక్రధరకర
శర్వాణీ ప్రణుత వినుత జగదాధారా
నిర్వాణ నాధ మాధవ
సర్వాత్మక నన్ను గావు సరసుఁడ కృ. 64

క. సుత్రామ నుతజనార్దన
సత్రాజిత్తనయనాధ సౌందర్యదళా
చిత్రావతార దేవకి
పుత్రా ననుగావు నీకు పుణ్యము కృ. 65

క. బలమెవ్వఁడు కరిబ్రోవను
బలమెవ్వఁడు పాండుసుతుల భార్యను గావం
బలమెవ్వఁడు రవిసుతునకు
బలమెవ్వఁడు నీవు నాకు బలమా కృ. 66

క. పరుసము సోకిన యినుమును
వరుసగ బంగారమైన వడువున జిహ్వన్
హరి నీ నామముసోకిన
సురవందిత యేను నగుదు సులభుఁడ కృ. 67

క. ఒకసారి నీదునామము
ప్రకటముగా దలచువారి పాపము లెల్లన్
వికలములై దులగుటకును
సకలార్థ యజామిళుండు సాక్షియె కృ. 68

క. హరి సర్వంబున గలఁడని
గరిమను దైత్యుండు బలుక కంబములోనన్
యిరువొంద వెడలి చీలవె
శరణన్న విభీషణుండు సాక్షియె కృ. 69

క. భద్రార్చిత పదపద్మను
భద్రాగ్రజ సర్వలోకపాలన గుణ శ్రీ
బలభద్రానుజ కేశవ
భద్రాధిప నన్ను బ్రోవు భయహర కృ. 70

క. ఎటువలె కరిమొఱ వింటివి
ఎటుఁ బ్రహ్లాదుకునకు నభయమిచ్చితి కరుణ
న్నటువలె నను రక్షింపుము
కటకట నిను నమ్మినాఁడ గావుము కృ. 71

క. తటతట లేటికి జేసెను
కటకట పరమాత్మ నీవు ఘంటాకర్ణన్
ఎటువలె నిపుణుని జేసితి
నటువలె రక్షింపుమయ్య యచ్యుత కృ. 72

క. తురగధ్వరంబు జేసిన
పురుషులకును వేరె పదవి పుట్టుట యేమో
హరి మిము దలచినవారికి
యరుదా కైవల్య పదవి యచ్యుత కృ. 73

క. ఓపుండరీక లోచన
యో భరతాగ్రజ మురారి యో రఘురామా
యో భక్త కామధేనువ
యో భవహర నన్ను గావు మోపిక కృ. 74

క. ఓతండ్రి కనక కశ్యపు
ఘాతకునై యతని సుతుని కరుణను గాచెం
బ్రీతి సురకోటి బొగడగ
నా తండ్రీ నిన్ను నేను నమ్మితి కృ. 75

క. ఓ పుండరీక లోచన
యోపురుషోత్తమ ముకుంద యో గోవిందా
యో పురసంహార మిత్రుడ
యోపుణ్యుఁడ నన్నుఁబ్రోవుమో హరి కృ. 76

క. ఏవిభు ఘోరరణంబున
రావణుని వధియించి లంక రాజుగ నిలిపెన్
దీవించి యా విభీషణు
నా విభునే దలతు నేను నచ్యుత కృ. 77

క. గ్రహభయ దోషము బొందదు
బహుపీడలు చేర వెఱచు పాయును నఘముల్
ఇహపర ఫలదాయక విను
తహతహ లెక్కఁడివి నిన్ను దలచిన కృ. 78

క. గంగ మొదలైన నదులను
మంగళముగ జేయునట్టి మజ్జనములకున్
సంతతి గలిగిన ఫలములు
రంగుగ మిము దలచు సాటిరావుర కృ. 79

క. ఆ దండకావనంబున
కోదండము దాల్చినట్టి కోమలమూర్తీ
నాదండ కావురమ్మా
వేదండము కాచినట్టి వేల్పవు కృ. 80

క. చూపుము నీ రూపంబును
పాపము దుష్కృతములెల్ల. పంకజనాభా
పాపుము నాకును దయతో
శ్రీపతి నిను నమ్మినాఁడ సిద్ధము కృ. 81

క. నీ నామము భవహరణము
నీనామము సర్వసౌఖ్య నివహాకరంబు
న్నీనామ మమృతపూరము
నీ నామము నేదలంతు నిత్యుఁడ కృ. 82

క. పరులను నడిగిన జనులకు
కురుదిసుమీ యిదియటంచు గురుతుగ నీవు
న్గురుచవునై వేడితివి
ధర పాదత్రయము బలియుద్దయు కృ. 83

క. పాలును వెన్నయు ముచ్చిలి
రోలను మీతల్లిగట్ట రోషముతోడన్
లీలావినోదివైతివి
బాలుఁడవా బ్రహ్మగన్న ప్రభుఁడవు కృ. 84

క. రఘునాయక నీనామము
లఘుమతితో దలఁచగలనె లక్ష్మీరమణా
అఘములు బాపుము దయతో
రఘురాముఁడవైన లోకరక్షక కృ. 85

క. అప్పా యిత్తువు దయతో
నప్పాలను నతిరసంబు లనుభవశాలీ
యప్పా నను గనుగొనవే
యప్పా నను బ్రోవు వేంకటప్పా కృ. 86

క. కొంచెపువాఁడని మదిలో
నెంచకుమీ వాసుదేవ గోవిందహరీ
యంచితముగ నీ కరుణకు
కొంచెము నధికంబు గలదె కొంతయు కృ. 87

క. వారివి నీ భక్తులకుం
గారవమున నెగ్గుసేయు గర్వాంధులకున్
దేవ వధించుట వింటిని
నీవల్లను భాగ్యమయ్యె నిజముగ కృ. 88

క. అయ్యా పంచేంద్రియములు
నుయ్యేలలను నూచినట్లు లూంక నేనున్
చయ్యన కలచుచు నుంటివి
కుయ్యాలింపుము మహాత్మ గుణుతుగ కృ. 89

క. కంటికి రెప్పవిధంబున
బంటుగదా యనుచు బాయక యెపుడున్
జంటయు నీవుండుట నే
కంటకమగు పాపములను గడచితి కృ. 90

క. యమునికి యిక నే వెఱువను
కమలాక్ష జగన్నివాస కామిత ఫలదా
విమలమగు నీదు నామము
అమరగ దలంచెదను వేగ ననిశము కృ. 91

క. దండమయా విశ్వంభర
దండమయా పుండరీక దళనేత్రహరీ
దండమయా కరుణానిధి
దండమయా నీకు నిపుడు దండము కృ. 92

క. నారాయణ లక్ష్మీపతి
నారాయణ వాసుదేవ నందకుమారా
నారాయణ నిను నమ్మితి
నారాయణ నన్ను బ్రోవు నగధర కృ. 93

క. తిరుమణి దురిత విదూరము
తిరుమణి సౌభాగ్యకరము త్రిజగము లందున్
తిరుమణి బెట్టిన మనుజుడు
పరమ పవిత్రుండు భాగ్యవంతుఁడు కృ. 94

క. దుర్వార చక్రహస్తుడ
శర్వాణీ వినుతనామ జగదభిరామా
నిర్వాణనాథ మాధవ
సర్వాత్మక నన్నుగావు సరసుఁడ కృ. 95

క. శ్రీలక్ష్మి నారాయణ
వాలాయము నిన్ను దలతు వందిత చరణా
ఏలుము నను నీ బంటుగ
చాలగ నిను నమ్మినాను సరసుఁడ కృ. 96

క. శ్రీధర మాధవ యచ్యుత
భూధర పురుహూతవినుత పురుషోత్తమ నీ
పాదయుగళంబు నెప్పుడు
మోదముతో నమ్మినాడ ముక్తుల కృ. 97

క. శిరమున రత్న కిరీటము
కరయుగమున శంఖచక్ర ఘనభూషణముల్
యురమున వజ్రపు పతకము
శిరినాయక యమరవినుత శ్రీహరి కృ. 98

క. అందెలు పాదము లందున
సుందరముగ నుంచినావు సొంపలరంగా
మందరధర మునిసన్నుత
నందునివరపుత్ర నిన్ను నమ్మితి కృ. 99

క. కందర్పకోటి సుందర
మందరధర నామ తేజ మధుసూదన యో
సుందరవిగ్రహ మునిగణ
వందిత మిము దలతు భక్తవత్సల కృ. 100

క. అనుదినము కృష్ణశతకము
వినిన పఠించినను ముక్తివేడుక గలుగున్
ధనధాన్యము గోగణములు
తనయులు నభివృద్ధిబొందు తద్దయు కృ. 101

క. భారద్వాజస గోత్రుడ
గారవమున గంగమాంబ కరుణాసుతుఁడన్
పేరు నృసింహాహ్వయుఁడను
శ్రీరమణా నన్నుగావు సృష్టిని కృష్ణా. 102

సంపూర్ణము.



పాప్యులర్ ప్రెస్, తెనాలి.

మా నూతన పాఠశాలా ప్రచురణములు.

## వాణీవాచకములు

ఆంధ్రభాషాలంకారములు పాఠ్యపుస్తకములలో నుత్తమములు
ప్రాథమిక విద్యాశిక్షణయందు చక్కని యనుభవము
గలవారిచే వ్రాయబడినవి.

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | 0-3-0 | ఐదవ తరగతి | 0-6-0 |
| రెండవ తరగతి | 0-3-0 | ఆరవ తరగతి | 0-7-0 |
| మూడవ తరగతి | 0-4-0 | ఏడవ తరగతి | 0-8-0 |
| నాలుగవ తరగతి | 0-5-0 | ఎనిమిదవ తరగతి | 0-8-0 |

## సారస్వతవాచకములు

**G. RANGARAO NAIDU B. A., L. T.,**
**M. VENKATARATNAM B. A.**

(ఎలిమెంటరీ పాఠశాలలలో ఉపవాచకములుగ నుపయోగింప

మొదటి పుస్తకము (పెద్దటైపులో) 2వ తరగతికి
రెండవ పుస్తకము మూడవ తరగతికి
మూడవ పుస్తకము నాలుగవ తరగతికి
నాలుగవ పుస్తకము ఐదవ తరగతికి

## జనరల్ నాలెడ్జి - సివిక్సురీడరు

| | | | |
|---|---|---|---|
| రెండవ తరగతి | 0-3-0 | నాలుగవ తరగతి | 0-5-0 |
| మూడవ తరగతి | 0-4-0 | ఐదవ తరగతి | 0-6-0 |

## హిందూదేశచరిత్రము

| | | |
|---|---|---|
| నాలుగవ తరగతికి | (అడిదం నారాయణమూర్తి M. A., L. T., ) | 0-4-0 |
| ఐదవ తరగతికి | డిటో | 0-5-0 |
| మొదటిఫారము | (తెలికచెర్ల సూర్యప్రకాశరావు, | 0-8-0 |
| రెండవఫారము | బి. యే., యల్. టి., గారు వ్రాసినవి.) | 0-12-0 |
| మూడవఫారము | | 0-12-0 |

వలయువారు:-

ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, (రిజిష్టర్డు)

హెడ్డాఫీసు:-తెనాలి.

బ్రాంచెస్-గుంటూరు, మద్రాసు, బెజవాడ.